# డాక్టర్ మోపిదేవి కృష్ణస్వామిగారి ఇతర రచనల పరిచయం

## 1. స్వామి గేయాలు :

మానవజీవిత గమనాన్ని అర్థవంతంగా తీర్చిదిద్దగల గేయాల సంపుటి. ఇందులోని గేయాలు ఆచరణపరులకు అరచేతిదీపాలు. మతాతీతస్థితిని మనకు అందిస్తూ, భావాతీతస్థితిని అనుగ్రహించగల వేదగీతిక లనదగిన గేయాలు ఇందులో చాలాఉన్నాయి. మానవ జీవితంలో కావలసిన సమన్వయం, సాధించవలసిన పరమార్థం ఈ గేయాలు మధురంగా, మందంగా అందిస్తాయి.

## 2. దర్శనాలు - నిదర్శనాలు :

కృష్ణస్వామిగారి మొదటి వచనరచన. ఈగ్రంథంలో మాస్టర్ ఇ. కె. వాణి వినిపిస్తుంది. కృష్ణస్వామి బాణి కనిపిస్తుంది. మాస్టర్ ఇ. కె ప్రసంగాలలోని అమృతోపమానాలకు కృష్ణస్వామిపట్టిన అంజలియే ఈగ్రంథం అందరికీ తెలిసిన అంశాలను ఉదాహరణలుగా తీసుకొని, అందరికీ తెలియవలసిన అంశాలను మాస్టర్ ఇ. కె. ఎలా తెలియచెబుతారో ఇందులో తెలుస్తుంది. ఇ. కె. గారినుండి దిగి వచ్చిన ఆ 'దర్శనాలు- నిదర్శనాలను' కృష్ణస్వామి నేర్పుతో కూరుప చేసి చెబుతారు ఈగ్రంథంలో. యోగసాధనకూ నిత్యజీవిత నిర్వహ

ణానికీ, సృష్టితత్త్వ దర్శనానికీ కావలసిన అంశాలెన్నో ఈ గ్రంథం వెన్నతో పెడుతుంది. ఈ గ్రంథం చదువుకొనేవారికి జీవితం అర్థమవుతుంది. భగవద్గీత, పతంజలియోగసూత్రాలు మొదలైన దివ్య గ్రంథాలను జీవితానికి ఎలా సమన్వయించుకోవాలో బోధపడుతుంది. ఈ గ్రంథపఠనం అర్థవంతమైన జీవితానికి ఆరంభం.

## 3. సందేహాలు – సమాధానాలు :

గుమ్మంవద్దర నిలబడి మాస్టర్ ఇ. కె. ను చూస్తున్నవారికి కలిగిన సందేహాలకు కృష్ణస్వామి చెప్పిన సమాధానాలు ఈ గ్రంథంగా కూర్పు చేయబడినాయి. నిలబడినవారి పరిణామాన్నిబట్టి సందేహాలు రకరకాలుగా ఉంటాయి. కృష్ణస్వామి సమాధానాలుకూడా సందేహాలకు తగ్గట్టుగా ఉంటాయి. ఒకచోట సరసంగా, మరోచోట గంభీరంగా, ఇంకొకచోట విజ్ఞానదాయకంగా - ఇలా ఔచిత్యవంతంగా ఉంటాయి. మహానుభావుల జీవితాలకు చెప్పబడిన భాష్యమా ఈ గ్రంథం అనిపిస్తుంది. ఏ మహానుభావుణ్ణి అయినా ఎలా అర్థంచేసుకోవాలో ఒక ఆప్తునిలా వివరిస్తుంది గ్రంథం. ఆ అర్థంచేసుకోవడం అలా జీవించడానికే సుమా అని హెచ్చరిస్తుంది. చేయిపట్టుకొని నడిపిస్తుంది. మహానుభావుల జీవితాలలోతులను వెలికి తీసి చూపించినట్లే సనాతనధర్మం యొక్క లోతుపాతులను కూడా పరిచయం చేసే ప్రయోజనాత్మకమైన గ్రంథం ఇది.

## 4. సంభాషణలు – సమన్వయాలు :

సర్వసాధారణంగా ప్రతిమనిషికీ కొన్ని సందేహాలు ఎంత వద్దన్నా కలుగుతూ ఉంటాయి. మృత్యువు అంటే ఏమిటి ? మృత్యువు తరువాత జీవి ఏమవుతాడు ? ఎక్కడుంటాడు ? స్వర్గ నరకాలున్నాయా ? పునర్జన్మ ఉంటుందా ? పునర్జన్మలు గుర్తు

రావడమనేది నిజమేనా ? పితృకర్మలు చేస్తారుగదా, వాటివల్ల పోయినవారికి కలిగేమేలేమిటి ? ఆర్థిక అసమానతలకు, కష్టసుఖాలకు పూర్వజన్మలు కారణమా ? - మొదలైన సంశయాలు మనిషి మనస్సును అవకాశం వచ్చినప్పుడల్లా పీకుతూఉంటాయి ఈపీకడానికి మతాలతో, పార్టీలతో, సిద్ధాంతాలతో ప్రమేయంలేదు - మనిషయితేచాలు. సహజంగా కలిగే ఈసంశయాలను తీర్చకుండా ఆధ్యాత్మికతపేరిట బ్రహ్మజ్ఞానాన్ని ఎంత నూరిపోసినా మనిషి మళ్ళీ మొదటికి వస్తూఉంటాడు. ఈసంశయాలకు తగినవివరణను అందించి, ఆపైన అమూల్యమైన విషయాలను ఎన్ని చెప్పినా ఫర్వా లేదు అన్న భావన కలిగి కృష్ణస్వామి మాస్టరుగారినుండి ఇటువంటి సంశయాలన్నింటికీ తగిన సమన్వయాలను రాబట్టారు ఈగ్రంథంలో. ఇంకా, పూనకాలు, ఆవేశాలు, చేతబడులు, చిల్లంగులు, మందులు, వశీకరణాలు మొదలైనవాటి స్వరూపస్వభావాలనుగూడా మాస్టరుగారినుండి రాబట్టారు. నిత్యపూజలో కలిగే సంశయాలను తీర్చారు. సామాజికసమస్యలకు పరిదారులు చూపించారు. సమాజంలో స్త్రీ పాత్రను పరామర్శించారు. ఈగ్రంథం కల్పవృక్షం లాంటిది. కోరినకోరికనల్లా ఆ కల్పవృక్షం తీరిస్తే, కలిగిన సంశయాన్నల్లా ఈ కల్పవృక్షం తీరుస్తుంది.

## 5. అన్వేషణ - అనుభూతి :

కృష్ణస్వామి సంక్షిప్త జీవితగాథ ఇది. పేరుతీసి ప్రక్కన పెడితే ఈగ్రంథంలో ఉన్నది ఒక భారతీయ యువకుడు ఎవరు చదువుకొంటే వారికి వారిగాథలాగానే అనిపించి నడిపిస్తుంది. నేటి యువకుడు చేస్తున్న ఆవేదనాత్మకమైన అన్వేషణ, దానికిగాను అతడు పొందవలసిన ఆచరణశీలమైన అనుభూతీ ఈ చిన్నగ్రంథంలో చక్కగా అందించబడినాయి. యువతరానికి ఎలాంటి అవగాహన

అవసరమో, ఆ అవగాహన ఏవిధంగా ఆచరణీయమైన రూపాన్ని ధరించాలో ఈ చిన్నిపుస్తకం చిన్నదీపమై చూపిస్తుంది. జాతి పునర్నిర్మాణానికి చేయూతనిచ్చే గ్రంథాల్లో ఇది ఒకటి.

## 6. అక్షరాల్లో అనుభూతులు :

పెద్దవాళ్ళను చూసి మెచ్చుకోవడం సహృదయతకు చిహ్నం; వారిలా నడుచుకోవడం ఆ మెచ్చుకోవడానికి గమ్యం అంటారు కృష్ణ స్వామి. నడుచుకోవాలి అంటే ఆ పెద్దవారినడతను తెలియజెప్పేవారు కావాలి. ఆ తెలియజెప్పే ప్రయత్నంలోనే వాల్మీకినుండి రామాయణం, వ్యాసుడినుండి భారతభాగవతాలు దిగివచ్చాయి. అలాగే మాస్టరుగారి జీవితంతో మనజీవితాలను స్పృశించడానికి కొన్ని సన్నివేశాలను ఎంచి, వర్ణించి, కూర్పు చేశారు కృష్ణస్వామి. అనుభూతి అక్షరాల్లో ఒదిగినందుకు తృప్తిచెందుతూ 'అక్షరాల్లో అనుభూతులు' అని పేరు పెట్టారు. నిత్యజీవిత నిర్వహణను తీర్చిదిద్దగల శక్తి ఈ గ్రంథానికి ఉన్నది. ఇందులోని సన్నివేశాలు మాస్టరుగారి జీవితంనుండి స్వీకరించిన మేలుబంతులలాంటివి. 'ఆ మేలుబంతులను చూస్తూ మన జీవితసన్నివేశాలను తదనుగుణంగా మలచుకోగలగడంకోసమే ఈ గ్రంథం వచ్చింది' అంటారు కృష్ణస్వామి.

## 7. మానవసేవలో – మాస్టర్ ఇ. కె :

కులపతి ఎక్కిరాల కృష్ణమాచార్య తెలుగులో ఎం. ఏ, పిహెచ్.డి గదా, మరి ఆయన హోమియోవైద్యులు ఎలా అయ్యారు? హోమియోవైద్యులు అవ్వడమేకాకుండా వందలకొలది హోమియో ఉచితవైద్యాలయాలను నిర్వహింపజేసే ఒకమహోద్యమంగా ఎలా విజృంభించారు? ఈ విజృంభణకు వెనుకఉన్న గాథ, ఆ గాథలోని పరిణామం, ఈ విజృంభణయొక్క వైఖరి, దానిగమ్యం ఈ గ్రంథం

గంభీరంగా వివరిస్తుంది. నేటి దేశపరిస్థితులను సమీక్షిస్తూ ఇ. కె. ఉద్యమం దేశపునర్నిర్మాణానికి ఎలా బాట వేస్తున్నదీ దర్శింపజేస్తుంది ఈ గ్రంథం. చదువరిని మరో ప్రపంచానికి వారసుణ్ణి చేస్తుంది.

## 3. మాటలు – మంత్రాలు :

మాస్టర్ ఇ. కె. సన్నిధిలో వికసిస్తున్న కృష్ణస్వామి ప్రజ్ఞాకమలం వెదజల్లుతూవస్తున్న సౌరభాలకు శ్రీ వి. చక్రపాణిరావు వాసిక ఒగ్గగా రూపుకట్టినవే 'మాటలు - మంత్రాలు'. కృష్ణస్వామి మాటలు మంత్రాలుగా దర్శించిన చక్రపాణిరావు ఆ మంత్రాలను సందర్భసహితంగా ఈ గ్రంథంలో వివరించారు. ఈ గ్రంథంలో ఆరు అధ్యాయాలున్నాయి. మాస్టర్ ఇ. కె - మనం, తీరని బాధ - తీరైనబోధ, మాత్రలవైద్యం - మాటలవైద్యం, సమాజము - సంస్కరణ, సహచరులు - పరిచారి, ఆత్మవిద్య - అసలురూపం అనే ఆ అధ్యాయాల పేర్లు ఆయా అధ్యాయాల్లో ఏమేమి వివరించబడినవో సూచిస్తున్నాయి. మాస్టర్ ఇ. కె. వెలుగుకు కృష్ణస్వామి అంజలించిన 'దర్శనాలు-నిదర్శనాలు' ఎటువంటివో కృష్ణస్వామినుండి దిగివస్తున్న సరసమైన సందేశానికి చక్రపాణి చేసిన ఈ కూర్పు అలాంటిది. దేశపునర్నిర్మాణానికి ఈ గ్రంథంలోని పలుకులు ప్రణాళికలను సూచించగలవు. ఈ గ్రంథం మనతో ఉంటే కృష్ణస్వామి మనతో ఉన్నట్లే ఉంటుంది.